# VARTHAMANA LIPI

A Collection of poems

**K.J.RAMESH**





**First Edition Mar 2001**

**Copies : 1000**

**Cover Design** : MUDRICA OFFSET PRINTERS
& PROCESS HOUSE, VIJAYAWADA.

**Printing** : Sri Venkataramana Off-set, VINUKONDA

*For Copies* : Teacher's Street
Nirmala Nagar (post)
VINUKONDA - 522 647
Guntur Dist. A.P.
Ph. 08646 - 74403

**Library Edition Rs. 50/-**

**Common Edition Rs. 40/-**

నాకు జన్మనిచ్చి,

విద్యాబుద్ధులు నేర్పించి, నన్నింత వాడ్ని చేసి ఇంకా

ఎంతగానో ఎదగాలని ఆశీర్వదిస్తున్న నా జననీ జనకులు

శ్రీ కొర్రపాటి జేమ్సు, శ్రీమతి. కొర్రపాటి నాగరత్నమ్మ లకు

భక్తి పూర్వక వందనాలు చెబుతూ,

ఈ నా తొలి కృతిని సమర్పించు కొంటున్నా.

కె. జె. రమేష్.

- కలిమి లేములలోనే గాదు నా అభిరుచులలోనూ నాకండగా యుండి, ఈ 'వర్తమానలిపి' మీ ముందుకు తీసుకు రావటానికి సహకరించిన నా శ్రీమతి. కె. ఝాన్సీకి....

- నా పనులు చెడగొట్టకుండా నా కవితల్ని అపుడపుడు శ్రద్ధగా వింటూ తమ పనులు చేసుకొంటున్న నా ప్రియ కుమారులు చిరంజీవులు సునీల్, అనిల్ కుమార్‌లకు ఆశ్శీస్సులు.

- తమ వంతుగా నాకు కొంత ఆర్థిక సహాయం చేసిన శ్రీ రాజేశ్వరీ ఫ్యాన్సీ & కంగన్ హాల్ అధినేత శ్రీ రావెళ్ల గోపీచంద్, పి.వి.ఆర్. జ్యువెలరీ సంస్థ అధినేత శ్రీ పొత్తూరి గోపాలరావు &బ్రదర్స్ కు....

- ఈ కవితా సంపుటిని ఇంత అందంగా తీర్చిదిద్దిన శ్రీ వేంకట రమణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, వినుకొండ ప్రొప్రయిటర్ : శ్రీ కాకుమాను వెంకట సత్యనారాయణకు మరియు సిబ్బందికి...

- ముఖ చిత్రం అందంగా భావయుక్తంగా తయారు చేసిన ముద్రికా ఆఫ్‌సెట్ ప్రింటర్స్ & ప్రాసెస్ హౌస్, విజయవాడ, ఇందుకు సహకరించిన నా ప్రియ మిత్రులు శ్రీ తూములూరి రాజేంద్రప్రసాద్, ఆంధ్రాబ్యాంకు, విజయవాడవారికి....

# కృతజ్ఞతలు.

Jnanpith Awardee
**Dr. C.NarayanaReddy** M.P.
M.A., P.hd., D.Litt.
CHAIRMAN
Andhra Pradesh State Cultural Council
Government of Andhra Pradesh
KalaBhavan, Hyderabad - 500 004
☎ :(O) 214603 , (R) 3548451
Fax : (O) 214603





జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డా॥ సి.నారాయణరెడ్డి** ఎం.పి.
ఎం.ఏ.,పి.హెచ్.డి. డి.లిట్.
అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర
సాంస్కృతిక మండలి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కళాభవన్,
హైదరాబాద్ - 500 004
ఫోన్ :(ఆ)214603, (ఇ)3548451
ఫ్యాక్స్ : (ఆ) 214603


26-1-01

## అభినందన

సమస్యలు లేని సమాజం లేదు. దుఃఖ స్పర్శలేని హృదయం వుండదు. సగటు మనిషి నిరంతరం సంక్షోభ దశలో ఉంటాడు. అసలైన కవి అలా కాదు. అతడు ద్వంద్వ ప్రవృత్తుల రాపిడిలోనూ ఆశాజీవి. ఈ కవి శ్రీ రమేష్ ఆ కోవకు చెందిన ఆశాజీవి. అందుకే

" చలిస్తూ జ్వలిస్తూ రాస్తున్నా
ఈ
వర్తమాన లిపిని" అని అంటున్నాడు.

ఈ పుస్తకం శీర్షికకు తగ్గట్టుగానే అనేక కవితల్లో సమకాలీన సామాజిక ముద్ర వుంది. వ్యక్తి గత వేదనాఘోష ఉంది.

రమేష్ ఏది చెప్పినా స్పష్ట స్వరంతో చెబుతాడు. అనవసరమైన భావ చిత్రాల పులుముడు ఇతని రచనల్లో కనిపించదు.

" నా మనస్సు ఒక గాయాల పుట్ట
ఒక్కో గాయానిదో గాథ "

ఈ రెండు పంక్తులు చాలు రమేష్ తన అభిప్రాయాలను కవితాత్మకంగా ఎలా అభివ్యక్తీ కరిస్తాడో. మంచి కవితా సంపుటిని "వర్తమాన లిపి" రూపంలో ప్రచురిస్తున్న శ్రీ కె.జె. రమేష్ కు నా హార్దికాభినందన.

(సి. నారాయణరెడ్డి.)

డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు, డి.లిట్.

ఒంగోలు

## అభిప్రాయం

రమేష్ ప్రగతివాది, ఆశావాది. అక్షరాల తూకమూ కవిత్వ పాకమూ తెలిసిన వాడు. భావకుడు.

పక్షులకే కవిత్వం వస్తే
మేఘాల గూర్చి
వర్షపు జల్లు గూర్చి
గూడు గూర్చి
గుడ్ల గూర్చి
వ్రాయవా ? వర్ణించవా !

అంటాడు అరమోడ్పు కనులతో ఊహల నిచ్చెనపైపై మెట్లకు ఎక్కుతూ.

"జలపూజ" - గొప్ప భావనాబలం ఉన్న కవిత. కవికి సమాజం పట్ల సదవగాహన ఉంది. కవిత్వం పట్ల రచనాసక్తి, శక్తీ ఉన్నాయి.

అభివ్యక్తీకరణ పట్ల శ్రద్ధ వహిస్తే -, అక్షరాల పొదుపు యింకా పాటిస్తే మంచికవిగా రూపుదిద్దుకొంటాడనడానికి 'వర్తమానలిపి' నిండా వర్తమానాలున్నాయి.

ఒంగోలు
25-1-2001

- నాగభైరవ కోటేశ్వరరావు.

# నామాట

పాఠక మిత్రులకు నా నమస్కారములు. ఈ నా తొలికృతి "వర్తమానలిపి" ని ఆప్యాయతగా చదువుతున్నందులకు నా హృదయ పూర్వక ధన్యవాదములు.

నా ఈ కవితా సంపుటిని పరిశీలించి నా కవితలలో అక్షర తూకము, కవిత్వ పాకమూ యున్నదని తమ అమూల్యమైన అభిప్రాయాన్ని వ్రాసిన ప్రముఖ కవి **డా॥ నాగభైరవ కోటేశ్వరరావు** గార్కి, ఈ నా కవితల్లో విషయాన్ని స్పష్టంగా చెప్పానని, సమాజంలోని సగటు మనిషిని గూర్చి అతని సంక్షోభదశను గూర్చి స్పష్టంగా వివరించానని తెలియపరచి ఈ కవితా సంపుటికి తమ అభినందన పత్రాన్ని అందించిన ప్రముఖ కవులు, రాజ్యసభ సభ్యులు, జ్ఞాన పీఠ్ అవార్డు గ్రహీత అయిన **డా॥ సి. నారాయణరెడ్డి** గార్లకు నా హృదయ పూర్వక అభినందనలు.

నా కవితల్ని శ్రద్ధగా విని తగు సూచనలిచ్చి ఎంతగానో ప్రోత్సహించిన, ప్రోత్సహిస్తున్న **డా॥ బీరం సుందరరావు** గారికి నా ప్రత్యేక వందనములు.

**కె. జె. రమేష్**

# వర్తమాన లిపిలోకి......

మానవజన్మ అనేది ఒక వరం. భువిపైన కోట్లాది మానవులున్నా వారి రూపులోనూ, భాషలోనూ, భాషణలోనూ, మనః ప్రవృత్తులలోనూ ఎంతో వైవిధ్యం యుంది. ఇలా భిన్న ప్రవృత్తులు గల మానవులు ఒకచోట చేరి నివసించునపుడు వారి భావాలు, ప్రవృత్తులు ఇతరులపై వాటి ప్రభావం చూపుతుంటాయి. వాటిని దూరంగా దగ్గరగా పరిశీలించి వ్రాయబడినవే ఈ కవితలు.

బ్రతుకు ఒక కళ అయిపోయింది. మానవుడు సంఘజీవి అగుటచే సంఘం నుండి అనేక ఆటుపోట్లను అతను ఎదుర్కొనక తప్పదు. బ్రతకడం ఒక పోరాటం, అది ఒక ఆరాటం. ఆశల నిచ్చెనపైకి ఎక్కి, కోర్కెలు తీర్చుకుందాం అనుకునే వాడికి సమస్యల తోరణం అడ్డుగా నిలుస్తుంది. దాన్ని జయించాలి, అధిగమించాలి. నీ ముందర ఒకమాట, నీవు లేనప్పుడు ఒక మాట వినిపిస్తుంది. దాని ప్రభావం నీ జీవితం పైన యుంటుంది. సుఖాల తీరంలో ఓలలాడే మానవుడికి, సుఖాల అంతు చూడాలనే మానవుడికి చివరకు మిగిలేదేమి లేదు.

ప్రకృతిలో భాగమైనా మనం, కొన్నిసార్లు, ప్రకృతిని శాసించినా ప్రకృతిని జయించటం కల్ల. ఈ విశాల విశ్వంలో ఇంతవరకూ తెల్సి మన భూగ్రహం పైనే మానవ కోటి సంచారం. మరోగ్రహం, మరోగోళం మన ఆవాసానికి అనుగుణంగాలేదు.

ఇది మన అందరికీ తెల్సు. మరి వేరేచోట ఆవాసానికి అవకాశం లేనపుడు మనం ప్రక్క వాడ్ని బ్రతకనివ్వాలి. బ్రతికించాలి. ఎందరు తల్లిలేని శిశువులు రోడ్లపై చెత్తకుండీలలో ఉంచబడుతున్నారు. అణుబాంబుల్ని వరుసగా పేర్చుకొని మనం వాటి మీద శయనిస్తున్నాం. పులి మీద సవారీ చేస్తున్నాం. చివరకు అది మనల్ని కబళించవచ్చు.

అందుకే దేవుడిచ్చిన ప్రకృతిని కాపాడుకొంటూ, సాటి మానవుడి బ్రతకుకు మనకు చేతనైనంత సాయం చేసుకుంటూ, ప్రకృతి మాత మనల్ని చల్లగా చూడాలని కోరుకుంటూ, దేవుడి వర్కుషాపులో తయారీ అయిన ఈ అందమైన ప్రకృతి రమణీయతను పరిశీలిస్తూ ఇక రండి ఈ వర్తమానలిపిలోకి.....

మీ

**కె. జె. రమేష్.**

గ్లోరీహోమ్

వినుకొండ

## ఇదీ వరుస....


| వరుస | కవితా కుసుమం | పేజి నెం. |
| --- | --- | --- |
| 1. | వర్తమాన లిపి | 1 |
| 2. | అమ్మ అంటే | 4 |
| 3. | ప్రకృతిమాత | 6 |
| 4. | కలకోసం నిద్ర | 8 |
| 5. | లీవ్ మీ ఎలోన్ | 9 |
| 6. | శ్రమ దీపం | 12 |
| 7. | లైఫ్ పిక్సర్స్ | 15 |
| 8. | ఎదురు చూపులు | 17 |
| 9. | విహంగ వీక్షణం | 18 |
| 10. | జలపూజ | 20 |
| 11. | చీకటి నుంచి | 24 |
| 12. | ఊర్ధ్వ ముఖం | 28 |
| 13. | అద్దం చెబుతుంది | 29 |
| 14. | జ్ఞాపకాల కావ్యం కవి | 30 |
| 15. | జన్మ జన్మల బంధం | 33 |
| 16. | దేవుడు వర్కుషాపు | 37 |
| 17. | దివి నుండి భువికి దిగిరా | 40 |
| 18. | నీ కోసం ఎదురు చూస్తూ | 41 |
| 19. | జ్ఞాపకాల దొంతర | 43 |
| 20. | విశ్వ ప్రేమ | 44 |
| 21. | కవి వీలునామా | 46 |
| 22. | చైతన్య బాట కోసం | 47 |
| 23. | ఆకాశానికి నిచ్చెన | 49 |
| 24. | సముద్ర సంధ్య | 50 |
| 25. | శిశిరఘోష | 53 |
| 26. | సైబరు బతుకు | 54 |
| 27. | అన్వేషణ | 56 |
| 28. | అక్షరం అన్నమైన వేళ | 57 |
| 29. | గోడమీద పిల్లి | 58 |
| 30. | అదృశ్యశక్తి | 60 |
| 31. | తల్లి లేని శిశువు | 63 |
| 32. | రేపటి వారధులు | 64 |
| 33. | బతుకు | 66 |
| 34. | ఆకలి-సౌఖ్యం | 67 |
| 35. | సాఫల్యం అంచున | 68 |
| 36. | రైలు పోతూవుంది | 69 |
| 37. | సమాధి స్వగతం | 71 |
| 38. | చీకటి హృదయం | 72 |
| 39. | గాయాలపుట్ట | 74 |

## వర్తమాన లిపి....

భూత కాలపు గాయాల్ని చూస్తూ
అనుభవాలను మననం చేసుకొంటూ
ఆగమన దిశను నిర్దేశించు కొంటూ
భవిష్యత్‌లోకి ఆశగా తొంగిచూస్తూ
తలంచు కొంటూ
లిఖిస్తున్నా వర్తమానాన్ని
చలిస్తూ, జ్వలిస్తూ రాస్తున్నా
చెక్కుతున్నా వర్తమానపు జీవన శిల్పాన్ని.
ప్రాపంచిక భోగాలకు మనిషి అయ్యాడు దాసుడు,
మరోకోణంలో ప్రపంచాన్ని వీక్షిస్తూ అయ్యాడు అంధుడు.
పాపకూపాలకు అయిందీ అవని నెలవు,
పారమార్థిక చింతనలకు ఇచ్చారు సెలవు.
నోటితో పొగడుతూ,
నొసటితో వెక్కిరిస్తున్నారు కొందరు.
పెదాలతో దీవిస్తూ, అంతరంగంలో
అంతం కోరుతున్నారు మరికొందరు.
భుజాలపై తడతూ, నిమిరుతూ
వేటికోసమో వెదకు తుంటారు కొందరు.

కరచాలనమిస్తూ తమ వ్రేళ్లతో
సరిక్రొత్త లిపిని నీ చేతిలో దిద్దుతారు మరికొందరు.
నీవి పద్మనయనమ్ములంటూ చెబుతూ,
వెకిలి చూపులు అంటూ వెకిలిగా మాట్లాడెడివారు కొందరు.
నీది హంసనడకంటూ పొగడి,
ఆమె అడుగే అరిష్టం అనెడి వారు మరికొందరు.
చీర చాలా బాగుంది నీకు అంటూ చెబుతూ,
చీర వల్లే నీ కొచ్చింది అందం అనెడివారు కొందరు.
ఫస్టు క్లాసుకు పొగడుతూ,
పేపరు లీకుకు లింకు పెట్టెడి వారు మరి కొందరు.
తిరునాళ్లలో తిప్పారు విప్పారు ఆడదాన్ని నగ్నంగా
అనైతిక విలువలకు పట్టం కట్టారు ఖచ్చితంగా.
పాను పరాగు గుట్కాలతో జోగుతున్నారు కొందరు,
కమీషన్లు, దర్యాప్తులు, లంచాలతో గడుపు తున్నారు మరికొందరు.
సంతలో అమ్మకానికి జంతువుల అంగాలే ప్రమాణాలు,
'మిస్' పోటీల్లో అమ్మాయిల అంగాల అందాలే ప్రాతిపదికలు.
అక్కడా కొలతలే, ఇక్కడ కొలతలే.

పెగ్గులోని తరంగాలు

బొడ్డు పేగుని తెంచుతాయి,

మంగళ సూత్రాల్నీ మాయం చేస్తాయి.

ఆవిడ తెచ్చింది మూడు 'ల' లే

నే తీసుకుంది మూడు 'ల' లే

అన్న మాటలు అత్తింటి ఆరళ్లకు

నాందీ  వాక్యాలవుతున్నాయి,

సౌభాగ్యమణుల

జీవితాలెన్నో సమిధలవుతున్నాయి.

అందుకే

భూతకాలపు గాయాల్ని చూస్తూ

భవిష్యత్ వైపుకి ఆశగా చూస్తూ

లిఖిస్తున్నా వర్తమానాన్ని

చలిస్తూ, జ్వలిస్తూ రాస్తున్నా

ఈ

వర్తమాన లిపిని. 15-12-2000

# అమ్మ అంటే...

అమ్మ గురించి వ్రాయటం ఓ అదృష్టం
అమ్మ లేని వాడికి అవని అంతా శూన్యం.
అమ్మ విలువ వెలకట్టగల త్రాసు ఏది ఇలలో.
అమ్మే దైవం
అమ్మే ప్రపంచం
అమ్మే సమస్తం.
అమ్మ గురించి ఎంతైనా రాయవచ్చు,
అమ్మ గురించి ఎందరైనా రాయవచ్చు,
అమ్మ గురించి ఎవరు రాసినా కామాలతో ముగింపే.
అమ్మ గురించి రాయటం
అందరికీ చెల్లినా ముగింపు రాయగల
ధీరుడేడిల ..........
అందుకే
అమ్మ ను గురించి రాయడం ఓ అదృష్టం.
అమ్మ లేని వాడికి అంతా శూన్యం.
నిన్ను లోన ధరించి, మోసి
లోకానికి నిన్ను చూపి, పరిచయం చేసి
నీ నవ్వులు తన నవ్వులుగా
నీ రోదనం తన వేదనగా
నీ శోధనలు తన భాధలుగా
నీ బలహీనతలు తన బాధ్యతలుగా

పంచే తల్లి త్యాగాలుకు కామాలు మినహా
పులుస్టాపులతో
పనేముంది.
అందుకే
అమ్మ గురించి రాయటం అదృష్టం
అమ్మ లేని వాడు
తెగిన గాలిపటం
ఎటైనా పో వచ్చు.
అమ్మ లేని నాడు
అంతా శూన్యం, చుక్కానీ లేని నావ నీ బతుకు.
అమ్మ లేని క్షణం
జీవితం నిర్లిప్తత, స్థభ్దత, వ్యాకులత,
ఛీత్కారాలు, వడ్డింపులు, శాపనార్ధాలు
అందుకు అమ్మ అమ్మేరా!
అందుకే అమ్మని గురించి రాయటం అదృష్టం.
అమ్మా
అమ్మా
అని అరచినా
ఎన్ని సార్లయినా పలుకుతుందే గాని
మౌనం మాత్రం దాల్చదు.
అమ్మ ఉన్నవాడు అవనిని జయిస్తాడు,
అన్నీ ఉన్నా అమ్మ లేని వాడు ఏమీ లేనివాడు.
అందుకే అమ్మను గురించి రాయటం ,

# ప్రకృతిమాత...

ప్రకృతిమాత పేషెంటుగా మారి
వికృత రూపం దాల్చి విరుగుడు మందు కొరకు
విల విల లాడుతూ వీధుల వెంట పడింది.
'కలం' అనే స్టెతస్కోపుతో
'కడలి' అంత కళ్ళేసుకొని
'కాలపు' చెవులతో
గమనిస్తున్నా పరీక్షిస్తున్నా.
ఛ్ఛ్...... ఛ్ఛ్..... ఛ్ఛ్.....
రోగి పరిస్థితి బాగా లేదు
రోజుల స్తితీ అంత బాగానూ లేదు.
వోరల్‌గా కూడా వాకబు చేశా.
పేటెంట్ల పేరుతో హక్కులు
ప్లాస్టిక్ సంస్కృతితో ప్రకృతి ఒడికి తూట్లు.
విషవాయువులతో ఊపిరితిత్తుల ధ్వంసం
విశ్వాంతరాళాలలో ఏదో తెలియని మూగ నిద్ర
నిద్ర పట్టని స్థితి ... సరిగా మాటాడని స్థితి.
అణుధార్మిక వ్యర్థ పదార్థాల గుట్ట జీర్ణాశయంలో
ఓమూల మూలుగుతుంది....

సర్జరీ అవసరం గావచ్చు.

ధ్రువాల భాగం చిల్లి బడి

నిస్సహాయంగా ఎదురు చూస్తుంది తగిన వైద్యం కోసం.

జీవరాశి ప్రాణంపై ఆశలు వదలుకొని

బ్రతుకు జీవుడా అని పలాయనం సాగిద్దామన్నా

పయనించే గమ్యం తెలియక మా

ప్రారబ్ధం ఇంతే అని నిస్సహాయంగా, నిర్వేదంగా

బతుకు ఈడుస్తున్నది

మూగగా రోదిస్తున్నది.

ఈ స్థితి మార్చేదెవరు

మారేదెపుడు

ప్రకృతి మాత చికిత్సకు తగిన వైద్యం కోసం,

వైద్యశాల కోసం

వెదకండి

వెదకుదాం

చికిత్స లేకుంటే మన కన్నీ వ్యథలే

మానవ కోటికి మిగిలేదేమి లేదు

అసలు

మన మయినా మిగిలితేగా.

19-11-2000

# కల కోసం నిద్ర....

అర్ధరాత్రి

కలత నిద్ర

కమ్మని కలవచ్చి

పోయింది.

నిమేష మాత్రం స్వాంతన

తదుపరి కలచెదిరింది.

కల, కలకాలం

కమ్మని అనుభవంగా యుంటే

ఎంత బాగుంటుంది.

# లీవ్ మి ఎలోన్...

ప్లీజ్ నన్ను సుఖంగా చావనివ్వండి
ఆఖరిగడియల్లో నన్ను కనీసం
సుఖంగా చావనివ్వండి.
ఓ డాక్టర్,
నీ సూది మందులొద్దు
నీ సెలైన్ బాటిల్స్ ప్రక్కనే పెట్టు
గుండెలవిసేలా ఏడవాలని ఉంది
పొట్ట చెక్కలయ్యేలా నవ్వాలని ఉంది.
మరణ మృదంగ నాదధ్వని వినిపిస్తుంది
నా జీవిత సమరం అంతిమ దశకు చేరుకుంది
సమస్త విశ్వం నాకు ఏదోలా కన్పడుతుంది.
కట్టుకున్నవాడు
కన్న బిడ్డలు
చిన్నగా నా మనోః ఫలకం నుండి
కనుమరుగవుతున్నారు.

ఈ అందం శాశ్వతం కాదు

అన్న భ్రమ వీడింది.

ఈ

ప్రేమలు, పెళ్లిళ్ళు

అంతా హుళక్కి

అని తెల్సింది.

ప్రేమ గుడ్డిదయినా

ప్రేమ మధురం

కాని

నిలిచేదెవరు

నిలిపేదెవరు

నిలుపుకునేదెందరు.

శరీరం పట్టు తప్పుతుంది

నరాలు గుంజుతున్నాయి

కంటి చూపు మసక బారుతుంది

శరీరం రక్త సిక్తం

చావు ఈ యాక్సిడెంటు రూపంలో రావటం

యాధృచ్ఛికం.

అయినా తప్పదు

భరించక తప్పదు

బాధ భరించక తప్పదు.

అందుకే

చావులోనూ సుఖం కోరుతున్నా

ఓ డాక్టర్ ప్లీజ్

లీవ్ మి ఎలోన్...

లీవ్ మి ఎలోన్... 19-11-2000

(ప్రిన్సెస్ లేడీ డయానా చివరి క్షణాలను స్మరించుకొంటూ)

## శ్రమ దీపం.....

అరకొర జీతంతో

ఆమె ఆనందంగా పని చేస్తుంది.

అన్నీ తానై

అడుగేస్తుంది.

ఆమె నడిచే శ్రమ దీపం.

అపరిశుభ్రత దే రాజ్యం,

ఆమె రాకుంటే అస్తవ్యస్తం.

మస్తాన మెక్కడ అంటూ

కళ్ళు ప్రశ్నల్ని కురిపిస్తాయి

మస్తానమ్మనే అందరి చూపులు

అన్వేషిస్తాయి.

పదిరూపాయల అప్పని పదివేల

సమంగా పరిగణిస్తుంది.

ఆ పదిని పదిలంగా పదిరోజుల్లో

తెచ్చిస్తుంది.

పది కేమొస్తుందమ్మా అంటే

చిరునవ్వే పలుకుగా ఇస్తుంది.

మస్తానమ్మకు బహుపాత్రాభినయం

బాగా తెలుసు.

అమ్మాయిల కండగా

కాఫీ, టీ సప్లయరుగా

గేటు కాపలాదారుగా

ప్రత్యక్ష మవుతోంది.

అయినా

ఆమెది అరకొర జీతం

అయినా జీవితాన్ని సాగిస్తోంది.

బొడ్లో రూపాయి

ఆమెకదే ఓ రిజర్వు బ్యాంకు.

నోట్లో రేగ్గాయి

ఆమెకదో అమృత ఫలం.

చేతిలో కూరల సంచి

ఆమెకదే కల్ప వృక్షం.

కాళ్లకో పాత స్లిప్పర్ల జోడు

ఆమెకో రక్షక కవచం.

చలిలో పాత శాలువాతో

చీపుళ్లతో ప్రత్యేక్షమయ్యే ఆమెకు

చీపుళ్ల కట్టలే ఆమెకు గాండీవాలు,

చేటలే ఆమెకు అక్షయ తూణీరాలు.

చాకు పీసు ముక్కలు కావాలా అంటుంది,

ఈ రిజిట్టరు ఏ కలాసు దయ్యు!

'టయం' అయిందా మేష్టారు

పరిగెత్త బాక అబ్బాయి

అంటూ అందర్నీ ఆప్యాయంగా

పలుకరిస్తుంది, అల్లుకుపోతుంది.

అయినా ఆమెది

అరకొర జీతం

జీవితాన్ని సాగిస్తోంది.

ఏదో ఆశే

ఆమెను నడిపిస్తుంటుంది.

21-11-2000

(నెలకు రూ. 45 లు స్కూలు నందు స్కావెంజర్‌గా

పనిచేస్తున్న మస్తానమ్మకు సానుభూతిగా)

# లైఫ్ ఫిక్సర్స్....

వాళ్ళు కోట్లకు పడగలెత్తి
విశ్వాన్ని
ప్రజల విశ్వాసాన్ని ఎలా కొనాలి
అన్న ఆలోచనలో పడ్డారు.
సవాలక్ష ఆలోచనల మధ్య
'ఫిక్సింగ్' ప్రక్రియకుపక్రమించారు.
లైవ్ టెలికాస్టులో కొంతమంది
బ్లాకులో టికెట్లు కొని కొంత మంది
గంటల కొద్దీ క్యూల్లో నిలబడి కొంతమంది
వీక్షించారు
అయినా
ఓడిపోయాం.
మన పరువు తాకట్టుపెట్టారు కాదు,
మనపరువు ఫిక్సింగ్ చేశారు,
క్రీడా ప్రమాణాలు దిగజార్చారు,
అందినంత దండు కొన్నారు.
ప్రజల ఆశలపై నీళ్ళు చల్లారు.

అభిమానుల మాత్రం

ఆక్రోశంతో అరుస్తున్నారు

మనం గెలిచే వాళ్ళమే

కాని....

పోస్టు మార్టం ప్రక్రియ ఆరంభం

షరా మామూలే...

రేపే మరో మ్యాచ్ ఆరంభం

ప్రేక్షకుల్లో మాత్రం టెన్షన్

ఫిక్సర్లలో మాత్రం

తదుపరి రేట్లపై తర్జనలు భర్జనలు

మరలా టికెట్ల కోసం క్యూ

లైవ్ టెలికాస్టు ఆరంభం,

ప్రజల లైఫ్ ఫిక్సింగ్ ప్రక్రియకు శ్రీకారం. 22-11-2000

# ఎదురు చూపులు....

తల్లికోసం బిడ్డ ఎదురు చూచినట్లు
ప్రేయసి కోసం ప్రియుడు ఎదురు
చూచినట్లు
గ్లేసియర్లలలోని శవాలు
అంత్యక్రియల కోసం ఎదురు చూస్తున్నాయి.
నిండైన మంచు కొండలే వాటికి అండగా
వాటిని కాపలా కాస్తున్నాయి, B.S.F. దళంలా.
నా చుట్టూర హృదయం ద్రవించేలా
ఏడ్వండిర్రా అంటూ ఏడ్పుల కోసం ఎదురు చూస్తున్నాయి.
చిరునవ్వుతో కొన్ని శవాలు
సంతృప్తిగా సేద దీరుతున్నాయి
కొందరి శత్రుసైనికుల్ని శవాలుగా మార్చామన్న తృప్తితో.
నే బ్రతికి ఉన్నా అన్న భ్రాంతి కలిగిస్తూ
కొన్ని శవాలు అవతలి వాడ్ని
భయ పెడుతున్నాయి చేతిలో A.K.47 తో.
మంచు కొండలే పట్టు పరుపులుగా
మంచు ముద్దలే తలగడలుగా విశ్రమిస్తూ
బృహత్తరమైన కర్తవ్యం నెరవేర్చామని
తృప్తిగా ఎదురు చూస్తున్నాయి.

4-11-2000

(సియాచిన్ గ్లేసియర్‌లోని మంచుకొండల నడుమ వెలికి
తీయటాకిని వీలు లేని స్థితిలో యున్న భారత సైనికులను
స్మరించుకొంటూ)



కె.జె.రమేష్

# విహంగ వీక్షణం ...

పక్షులకే కవిత్వం వస్తే
మేఘాల గూర్చి
వర్షపు జల్లు గూర్చి
గూడు గూర్చి
గుడ్ల గూర్చి
వ్రాయావా, వర్ణించవా!
నాగుల నడకను
అలల తాకిడిని
మీనాల ఈతలను
వాటి సొగసైన కళ్లను
వివరించవా, వర్ణించవా!
నదీమతల్లులు సాగరాన్ని
కౌగలించుకునే సన్నివేశాన్ని
కనులకింపుగా
వివరించవా, వర్ణించవా!

లేళ్ళ పరుగులు

మృగరాజుల వీర విహారం

గజరాజుల గమన సౌందర్యం

మానవ మృగాల కిరాతక దృశ్యాలను

వీక్షించవా, వివరించవా!

కోయ దొరల సంగమాలను

కొంటె కుర్రాళ్ళ పోకిరి చేష్టలను

కొండలలో కోనలలో జలకమాడు

అందమైన యువతుల

అంగాల అందాలను

వీక్షించవా, వివరించవా!

టి.వి. యాంటెన్నాలను రిలాక్సింగ్ స్టాండులుగా

విమానాలను యాంత్రిక పక్షులుగా

రాకెట్లను, స్పేస్ షటిల్స్‌ను

అతిపెద్ద తారా జువ్వలుగా

వివరించవా, వర్ణించవా! 1-12-2000

# జలపూజ....

వర్షం వర్షం వర్షం
ఊరంతా వర్షం
ప్రపంచం అంతా వర్షం.
గొడుగులు తలలకు
రక్షక కవచాలగాను
వర్షపు జల్లుల నుండి
తుంటరుల నుండి
అప్పల వాళ్ళ నుండి
కాపాడు తున్నాయి.
ఓ చేత్తో చెప్పలు, చీర కుచ్చిళ్ళు
మరో చేతిలో గొడుగుతో ఉన్న అతివల
అరికాళ్ళ అందాన్ని ఆబగా చూస్తూ
ముఖ వర్చస్సు కోసం గుడ్లు మిటకరిస్తూ
గుబగుబలాడిపోయే
తుంటరుల దృక్కులనుండి
రక్షించేందుకు గొడుగులు తంటాలు పడుతున్నాయి.
అందుకే గొడుగులు
ఓ రక్షక కవచాలు

ఓ బురఖాలు, బుల్లెట్ ప్రూఫ్‌లు.

వాన చినుకులు గొడుగుచువ్వలనుండి జారి

చుక్క చుక్కగా

చుక్క చుక్కలుగా

క్రిందికి పడుతూ నా

నడకకు తాళం వేస్తున్నట్లు,

నా అరికాళ్ళకు జలపూజ చేస్తున్నట్లుంది.

చినుకు చినుకు నా అరికాళ్ళను స్పృశిస్తూ

చిదిగిపోయి విడిపోతుంది.

నా మురికిని కడిగి తాను మాత్రం

మరో ప్రక్కకు ఒదిగిపోతుంది.

సరిక్రొత్త మురికిని నా పాదాలు మరలా

స్పృశిస్తూ తిరిగి మట్టితో మమేకం అవుతున్నాయి.

చిదిమిపోయిన చినుకులు జట్లుకట్టి

పిల్ల కాలవల్లో చేరి

సంఘాలు ఏర్పరచుకొంటున్నాయి మాకూ

హక్కులున్నాయి అని చాటుకొంటున్నాయి.

జనం హడావిడి

తోపుడు బండ్ల హడావిడి

టీ వాడు జోరుగా పంచు తున్నాడు

బోరునీళ్ళు చూరునీళ్ళు కల్సిన తేనీరు

అందరికీ అమృతంలా.

పొగలు క్రక్కే ఆ నీరు అందరినీ

ఆనందపరుస్తుంది.

నోటి నుండి పొగలు గ్రక్కిస్తూ

మదిలో ఏవో ఆలోచనలు రేకెత్తిస్తున్నాయి.

మాంసం అమ్మే ఖాదరు క్రైమా కొడుతూ

కమ్మని కలలు కంటూ

ఎదురుగా ఉన్న కుక్క పిల్లను చూస్తున్నాడు.

కుక్క పిల్ల మాత్రం ఖాదరు కరుణా దృక్కుల కోసం

నిరీక్షిస్తూ, ముఖ కవళికలు మార్చుతుంది.

ఫ్యాన్సీవాళ్లు గొడుగుల వ్యాపారంలో

యమ బిజీగా ఉండి ఇదే అదనుగా

భావిస్తున్నారు.

నా గొడుగు సంతోషిస్తుంది దాని

సంఘం దిన దిన ప్రవర్ధమానం అవుతున్నదని.

నేనడుస్తూనే ఉన్నా.

కిళ్లీ కొట్టులో పాన్ పరాగ్‌లు పార్శిళ్ళు

అవుతున్నాయి రేపటికి మాన్‌సూన్

ఎలా ఉంటుందో అన్న ఆలోచనతో కొందరు.

చలిలో గుండెల్లో దట్టమైన పొగల కోసం బారులు

తీరి కొంటున్నారు,

తీసుకెళ్ళుతున్నారు వారికిష్టమైన
బ్రాండ్లను మరికొందరు.
తడిసిన మల్లెపూలను దాచుటెట్లు అన్న తాపత్రయంలో
ఓ రసిక శిఖామణి ప్రయాస.
నోట్లో పెగ్గు పోసుకుంటూ
క్వార్టర్న్ బొడ్లో దోపుకుంటూ
ఆటో వైపు చేయూపుతున్నాడు ఓ మహానుభావుడు.
బస్సులు జనాల్ని దింపుకుంటూ
అమ్మయ్య అని ఊపిరి పీల్చుకుంటూ
డిపోలకు చేరి ఆనంద పడుతున్నాయి,
గూటికి చేరిన గువ్వల్లా
తల్లి ఒడి చేరిన బిడ్డల్లా.
గొడుగు చువ్వలనుండి కారే నీటి బొట్లలో
భౌతిక శాస్త్రంలోని భావనలు కన్పిస్తున్నాయి.
వర్షం ఎంతమంచిది
ఎంత సుందరమైనది.
బీటలు వారిన భూమి ఒడిని కలిపే ఓ వైద్యురాలు
బజారు మురికిని వదిలించడంలో సిద్ధహస్తురాలు.
అందుకే వర్షం కావాలి
అందుకే వర్షం రావాలి
అందుకే వర్షం అంటే హర్షించని దెవరు

2-12-2000

## చీకటి నుంచి.....

ఆకాశానికి చిల్లి పడి
ఏవో జ్వాలలు నన్ను దహించాలని
వెంటాడుతూ నన్ను వేటాడుతున్నట్లున్నాయి.
ఇదేదో కంప్యూటర్ గ్రాఫిక్స్‌లా యుంది.
కాలం చెల్లిన విషయాలతో నామెదడు
బూజు పట్టి నిండి పోయింది.
సరి అయిన క్రిమి సంహరక మందుకోసం అన్వేషణలో
కాలం దొర్లిపోతుంది, చెల్లిపోతుంది.
మారణహోమ స్థితిలో భూమండలం
ఫేటీలుమని పేలకముందే
నా మస్కిష్క గోళంలో బ్రహ్మాండం
బ్రద్దలవుతున్నట్లు నాకు
లేశమాత్రంగా తోస్తోంది.
భోగోళం ఓమాయా జాలంగా
నాగుండె శృతి తప్పిన వీణగా
నా మది గాడి తప్పిన ధూమశకటంగా
భూనభోంతరాళ్ళు దద్దరిల్లే శబ్దాలతో
నా చెవులకు ఏవేవో ధ్వనులు
ప్రస్ఫుటంగా విన్పిస్తున్నాయి.

నా కంటిపాప మసక బారుతున్నట్లు

చేతులు రెంటిని ఎవరో మెలియబెట్టి

గొలుసులతో బంధిస్తున్నట్లు

నకగిపిస్తోంది.

భాష, భావుకత వ్యక్తీకరణలో

నా నాలుక తడబడి

వేయి చీలికలయ్యి

ఘట సర్వాకృతి నాలుకగా నా నాలుక

నాపరిధి నుండి

బయట పడి వికటాట్టహాసంగా

ఏదో వైపు తిరుగుతుంది.

నా పై నా కధికారం లేదు

నా అవయవాలపై నాకు పట్టు తప్పతుంది,

పట్టు తప్పింది.

జ్వాలల నుండి దూరంగా ఇంకా దూరంగా

పరిగెడుతున్నా.

దారంతా చీకటి

గతుకులమయం

అడుగులు తడబడుతున్నాయి

చీకటిని చూపులతో పగులగొట్టాలని

విశ్వప్రయత్నం చేసి నా కళ్ళు ఓడిపోయాయి.

గమ్యం అగమ్య గోచరం అయినా
పోతూనే ఉన్నా
జ్వాలలు వెంటాడుతూనే ఉన్నాయి.
గతుకుల రోడ్ల వెంట
కారు చీకటిలో
గాడి తప్పిన నా బ్రతుకును ఈడుస్తూ ప్రాణభీతితో
పరిగెడుతున్నా.
శరీరంలోని శక్త్యాగారాలలోని శక్తి
హైజాకర్ల చేతిలోని విమానంలోని ఇంధనంగా
మండిపోయింది.
విమానం దిగక తప్పదు,
నా ప్రయాణానికి ఫులు స్టాపు పెట్టక తప్పదు.
జ్వాలల నుండి చీకటి నన్ను
తప్పించ జూస్తున్నది.
నిస్సహాయంగా నిర్వేదంగా యున్న
నా ఎదురు చూపులకో నిరీక్షణ
చీకటి రూపంలో సాక్షాత్కరించింది.
జ్వాలలు వెదకుతున్నాయి.
చీకటి నన్ను తప్పించాలన్న తపనతో
తన శక్తి నంతా కూడ గట్టుకొని
జ్వాలలు చుట్టూర ఆవరిస్తుంది.

వారి పెనుగులాట పాము ముంగిసల
పెనుగులాటలా నాక్కన్పిస్తోంది.
భూగోళం చివర నేనున్నా
క్రింద అంతా శూన్యం
అక్కడ చీకటిదే రాజ్యం,
చీకటిదే సర్వస్వం.
జ్వాలలు నా వెదకులాటలో యున్నాయి.
ప్రాణభీతితో ఓమూల ఒదిగి కూర్చున్నా
తల్లిగర్భంలో నేనున్నస్థితి
నాకు గురుతొచ్చింది ఆక్షణంలో.
జ్వాలలు నన్ను కాల్చాలని ప్రయత్నించినా
జ్వాలలు నన్ను మాడ్చాలని చూసినా
చీకటి నాకు ఓ రక్షక కవచంలా యుంది
చీకటి నాకు ఓ కోటలా అనిపించింది,
అగుపించింది.
బ్రతుకుతీపితో ప్రాణభయంతో
నిస్సహాయస్థితిలో నిర్వేదనాస్థితిలో యున్న
నాకు చీకటే ఓ అమ్మగా
ఓ ఆత్మ బంధువుగా
అన్పించింది నా ముందర
సాక్షాత్కరించింది.

29-11-2000

# ఊర్ధ్వ ముఖం.....

భూమ్యాకర్షణ శక్తిని జయించి
రాకెట్లు అంతరిక్షంలోకి
పయనిస్తున్నాయి.
శూన్యాకర్షణ శక్తిని అధిగమించి
బల్లులు గోడలెగబాకుతున్నాయి.
రాకెట్లు అంతరిక్షంలో
అందలాలు ఎక్కినా
బల్లులు భవనాల
చివర బైఠాయించినా
చెడిన రాకెట్టు
తోక తెగిన బల్లి
క్రిందికి చూడ వలసినదే.
సంకేతాలు కోసం రాకెట్టు
తెగిన తోక నృత్యం చూస్తూ బల్లి
వేయి కళ్లతో వేచి ఉండ వల్సిందే.
హైటెక్కుతో టక్కు టిక్కు మంటూ
మురిసిపోతున్నా
మసక కళ్ళు మనల్ని పడవేస్తాయి
విజ్ఞాన వీచికలు మనల్ని మరలా ఓసారి
వెనుతిరిగి జూసుకోమంటాయి.

28-11-2000

# అద్దం చెబుతుంది.....

కులం బంధుత్వం కన్నా దగ్గరైంది.

స్వకులం అన్నమాటే పరమ నీచమైంది.

మావాడే అన్న భావం అతి హేయమైంది

సమాజాన్ని చీల్చుతుంది చీత్కరింప చేస్తుంది.

అద్దం ముందు నిలబడితే

మన బ్రతుక్కి అభయం ఇచ్చేదెవరు?

దిగంబరంగా నిలబడి

ఒక్కసారిగా నిన్ను నీవు చూసుకో

డొక్కలు మండే వాళ్ళ అరుపులు

నీ గదిలోకి చొరబడాలి.

పైన గులాబి అత్తర్లు గుబాళిస్తున్నా

హృదయకాలుష్యాన్ని తొలగించే

అసలైన అత్తర్లు ఇపుడు కావాలి.

అద్దం పగిలితే ముక్కలు కలియవు

మనస్సువిరిగితే మమతానురాగాలు వెల్లివిరియవు.

అందుకే అద్దం అబద్ధం చెప్పదు

అద్దం అందర్నీ సమంగా చూపుతుంది

అన్నింటినీ చూపుతుంది.

20-11-2000

# జ్ఞాపకాల కావ్యం కవి......

నిన్నటి దాకా మామధ్య కవిత్వంగా ప్రవహించిన నువ్వు
ఇవాళ కళేబరాల మధ్య కడ ఊపిరిని ఒదిలావా.
నిన్నటిదాకా చిరునవ్వుతో నవ్వించి నువ్వు
మాటల మకరందాన్ని పంచి పెట్టిన నువ్వు
నీటి అలల మీదగా తేలిపోతూ
మౌన యాత్రికుడిగా సాగి పోతున్నావా!
ఉప్పెనకేం తెల్సు ?
మనిషి గురించి
జీవిత వైశాల్యం గురించి
దానికి తెల్సిందల్లా ఒక్కటే
వేలాదిమందిని కనికరం లేకుండా కబళించటం.
మాటలతో మమ్మల్ని
మంత్రనగరికి తీసుకెళ్ళే నువ్వు
మాట్లాడకుండానే
మౌన ఋషిగా మారి పోయావు.
విజయ విషాద గీతికను ఆలపిస్తూ
నవ్వుల్ని పువ్వులుగా చల్లావు.

ఎన్నెన్ని సాహిత్య సభల్లో నువ్వు సాహిత్యంగా పరిమళించావు

ఎన్నెన్ని సమావేశాల్లో సంగీతాన్ని ఆస్వాదించావు.

నీ కర స్పర్శ మాకు ఉత్తేజాన్నిచ్చింది

ఊపిరిగా నిల్చింది,

ఊహను దానం చేసింది.

ఇపుడు ఈ అలల మధ్య

నీ శరీరం అచేతనంగా పడి ఉన్నా

నీ కలల సౌధం

ఒక్కసారిగా కుప్ప కూలినా

నీవు మాకు మిగిల్చిన

ఆశ మాత్రం చావలేదు.

నీవు అందని లోకాలకు వెళ్ళి పోయినా

నీ రూపం మా గుండెల్లో గుడి కట్టుకునేఉంది.

నీ ఆశయాల సాధనలో

మేం కార్యోన్ముఖులం అవుతూనే ఉన్నాం.

కల్లా కపటం లేని నీ చిరునవ్వు

మమ్మల్ని ముందుకు నడిపిస్తూనేఉంది.

నీ పాంచజన్యపూరిత శంఖారావం

మాకు నిరంతరం ఉత్తేజాన్నిస్తూనేఉంది.

నిండైన నీ మనస్సులో

మాకింత చోటివ్వు

నువ్వు మిగిల్చి పోయిన

జ్ఞాపకాల తీపి గుర్తుల్ని

కవిత్వం వాసనల గుబాళింపుల్ని

ఆస్వాదిస్తూ

ఆఘ్రాణిస్తూ

నీ కోసం చూస్తూనే ఉంటాం.

ఎందుకంటే

" సు కవి జీవి ప్రజల నాల్కల మీద ."

(1999 ఒరిస్సా తుఫానులో మరణించిన ఓ అజ్ఞాత

కవి మిత్రునికి కన్నీటి వీడ్కోలు)

# జన్మ జన్మల బంధం

నా చెట్టు

నన్ను చూచి నవ్వింది

కేరింతలతో పులకించి పోయింది

ఇది ఈ నాటి బంధమా

ఇరవై సంవత్సరాల అనుబంధం.

మా పెదబాబు చేతులలో విత్తనాలు పట్టి

మా చిన్నగాడు చేతితో నీరు పోస్తుంటే

మా ఇంటిలో ఓ మూల నాటాను నేను.

నిజంగా ఆ రోజు ఓ సుదినం.

విత్తనం ఫలించి వికసించిన దినం

నిజంగా ఆరోజు సుదినం.

నా తొలిసంతానం భూమిపై కాలిడిన రోజు

మావాడు ' అఆ ' లతో పలక పాడు చేసినరోజు

నే పొందిన ఆనందం అంతా ఇంతా కాదు

అదే ఆనందం పొందాను నేను ఆ దినం.

కాల చక్రంలో మార్పులు సహజం.

బదిలీలు అమ్మకాలు

క్రయాలు, విక్రయాలు సహజం.

ఓనమాలు పూర్తయిన మా అబ్బాయిలతో

వేరే ఊరికి సంసార జంఝాటంతో పయనం

మనకెందుకీ ఇల్లు ఇంకా అన్న

ఆలోచన ఇల్లు విక్రయానికి దారి తీసింది.

మరి ఒక సారి చెబుతున్నా మీకు ఇది

ఈనాటి మాట కాదు

ఇరవై సంవత్సరాల నాటి మాట.

కాల చక్రంలో మార్పులు చేర్పులు

పదవీ విరమణలు సహజం.

మరి నేడు ఓ కార్యార్థం ఈ ఊరికి రాకతో

నా ఒడలు పులకరించింది.

నా ఆనాటి గృహాన్ని తరించాలన్న కోరిక

బలీయం అయింది నాలో.

ఏమూలో భయం, ఉద్వేగం

అయినా దర్శించాను గృహం,

తరించాను ఆ గృహస్థుని ఆతిధ్యంతో

పులకించిపోయాను నేను నాటిన చెట్టు

ఫలభరిత సంపద భారంతో ఉంటేను.

నా కన్న బిడ్డ క్కాన్పుకు వచ్చినట్లయింది ఆ

చెట్టును చూస్తుంటే.

స్పృశించాను

నిమిరాను

తనివితీరా ఆప్యాయతగా

కౌగిలించుకొన్నా నా చెట్టును.

నా చెట్టు నన్ను చూచి పులకించింది.

చల్లని గాలికి ఎక్కడివో ఆకులపై

నీరు నా ఒంటిపై పడటం, నా

బిడ్డ కార్చిన ఆనంద భాష్పాలుగా అన్పించింది,

నాకు ఆ సమయంలో.

గాలికి ఆకులు కదలి నన్ను పలకరించినట్లు
నా నొసటిపై, చెక్కిలిపై ఆకులతో స్పృశించి
తిరిగి వాటి కొమ్మలలో మృదువుగా ఒదిగిపోయాయి.
నాచెట్టు నన్ను చూచి నవ్వుతోంది, కాదు
నాచెట్టు నన్ను చూచి మూగగా రోదిస్తుంది,
'నేను వస్తాను' అని ఆ గృహస్తునితో
చెబుతున్నప్పుడు.
అందుకే మాది ఈ నాటి బంధం కాదు
ఇరవై సంవత్సరాల బంధం, కాదు
జన్మ జన్మల బంధం.

(ది. 13-11-2000 న గుంటూరు విశాలాంధ్ర పబ్లికేషన్స్ వారి నిర్వహణలో జరిగిన పుస్తక ప్రదర్శనలో గౌ॥ డా॥ **శ్రీ బీరం సుందరరావుగారి** అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనంలో **డా॥ పాపినేని శివశంకర్** వంటి ప్రముఖ కవుల సమక్షంలో చదువ బడిన కవిత)

# దేవుడు వర్క్ షాపు

చంద్రుడు ఆకాశంలో
చక్కర్లు కొడుతూ
భూగోళంను తనతో షికారుకు
రమ్మని సైగ చేస్తున్నట్లుంది.
భూమాత కడివెడు సంసార భారంతో ఈదులాడే
స్త్రీ మూర్తిలా నిస్సహాయంగా చిరునవ్వు నవ్వి
ఓ నిట్టూర్పు విడిచింది.
కాలుతున్న క్రొవ్వొత్తి నే వెలుగు పంచుతున్నా
అన్న ఆనందంతో, అతిశయంతో
ఉబ్బి తబ్బియి పోతుంది.
మిణుగురులను చూసి దోమలు, ఈగలు
తమకు ఆ వరం లేనందుకు
సంతసిస్తున్నాయి.

తాము ఉభయచరాలు కానందుకు
మత్స్యాలు ఆనందంతో
అలల మధ్య జలాల మధ్య
జలకాలాడుతున్నాయి.
ఇతర మొక్కల చూపుల వాడిని
తప్పకునేందుకు
నెపంథిస్, డ్రాసిరాలు తప్పకుంటున్నాయి.
'సాక్షీ' దురంతం విన్న పులులు
ఒక్క సారిగా తమ గోళ్లను, తోళ్లను
చూసుకొంటున్నాయి.
గడ్డిపూలకు అందాన్ని
తామరలలో తళుకుదనాన్ని
వెన్నెలలో చల్లదనాన్ని
గులాబీలకు సోయగాలిచ్చిన

దేవుడపుడపుడు హాబీగా

ఆకాశంలో పెయింటు వేస్తూ

ఇంద్రధనస్సుల్ని చిత్రిస్తూ

ఆనందపడిపోతుంటాడు.

ఇవి చూసిన పికాసో, హుస్సేన్

అరిజోనాలు

దేవుడు వర్కుషాపు పెడతాడేమోనన్న

ఆశల ఆలోచనలో కొట్టుమిట్టాడుతున్నారు.

ప్రకృతిని పరవశింప చేద్దామన్న

తపనలో

దేవుడు

బిజిలీలో కొన్ని

బిజీగా ఉండి మరికొన్ని

చేసి సేద దీర్చు కుంటూ, సేద దీరుతూ

ప్రకృతి పాలన కొనసాగిస్తున్నాడు, కొనసాగిస్తుంటాడు.

27-11-2000

## దివి నుండి భువికి దిగిరా.....

నా ఊహల ఊసుల ప్రేయసీ

దివినుండి భువికి దిగిరా.

జలతారు కాంతుల మేలిమి వన్నెగల కన్యకవై

సుందర సుమధుర సువాసనలు

గుబాళించు పరిమళమై

శృంగార రస తరంగ మృదంగ

నాదం వినిపిస్తుండగ

రసమయ జగత్తులో లోకం

సొమ్మసిల్లి అలసి ఉండగ

సరస లావణ్య ముగ్ధ మనోహర

రూప లావణ్యములు సరిచేసుకొంటూ

పదములు కందకుండా

ఎరుపెక్కిన వదనంతో

కదన వేగంతో గగనం నుండి

భువికి దిగిరా!

7-12-1986

# నీ కోసం ఎదురు చూస్తూ...

నా ఊహల ఊసుల
ఊహాల సామ్రాజ్యరాణి!
నా తీరని కోర్కెలు
తీర్చే నా అలివేణి
నే విసిరిన పూల కొనలు తాకి
మూర్ఛబోయిన కుసుమ ముగ్ధ పూబోణీ
నా విరహ గీతికకు
పల్లవి చేకూర్చిన నా హృదయ రాగిణి
ఏమని వ్రాయను
ఎలా వ్రాయను
ఎంతని వ్రాయను.
అలికిడయితే నీకాలి
సంజెల సందడి అని నేననుకొన్నా.
వసంతంలో కోయిల రాగాలు
నాలో రేపాయి ఆనందపుటోద్రేకాలు.

గ్రీష్మ తాపానికి తాళలేక తపించాను,

నీ పొందు ద్వారా దాహం తీర్చుకోవాలని.

వర్షకాలపు వానలలో, వాగులలో

వెదికాను నీ కోసం ఎక్కడెక్కడో...

శరత్ చంద్రుని కాంతిలో

నిర్మిద్దామనుకొన్న మన కోసం ఓ రాజమహల్

హేమంత మంచు బిందువులతో నీ

వదనం అపుడే విచ్చిన పూవులా యుంటే

చిదిమి కోసుకోందామనుకొన్నా.

చివరకు

ఎండిన మ్రానువోలే

పండిన పండువోలే

నా ఊహల వెల్లువ ప్రవాహానికి గండిపడి

శిశిరం లోని భూరుహము వోలే

ఇక్కడ పడి యున్నా

నీ కోసం ఎదురు చూస్తున్నా.

# జ్ఞాపకాల దొంతర

జ్ఞాపకాలు పుస్తకాల దొంతరల్లా
దోగాడుతూ
మమ్మల్నీ ఓ సారి స్మరించుకోమంటూ
వెంటాడుతున్నాయి.
ఒక్కో జ్ఞాపకానిదో మధురానుభూతి
ఓ దొంతర కోటి భావార్థాలకు సమానం.
ఓ దొంతర నీ నా ఆలోచనల సరళకి దర్పణం.
ప్రియా! మధురం మనకలయిక అనే
పేజీలోకి తొంగి చూశా,
నన్ను నేను మై మరచిపోయా.
నాటి కాలపు స్మృతులు నన్నూ నా
మస్తిష్కాన్ని ఉక్కిరి బిక్కిరి చేసి నీ
జ్ఞాపకాల సంద్రం నడి బొడ్డున ఎత్తికుదేసినాయి.
ఆసంద్రంలో నేను ఏకాకిని
నీ మధురమైన చిరునవ్వే ఆశాకిరణంగా
నీ వయ్యారపు నడకే నాకు ఆసరాగా
కన్పించింది, నన్ను ఒడ్డుకు చేర్చింది.

## విశ్వప్రేమ....

విశ్వం కన్నతల్లి వంటిది

విభూతి రేఖలతో యున్న

'దశకంఠులనూ '

విధివంచితులనూ భరించగలదు.

మన మెదళ్ళు కోటి ఆలోచనలకు కార్ఖానాలు

అవికావాలి మానవాభ్యుదయానికి సంకేతాలు.

హృదయం లేని మెదడు పంపే సంకేతాలు

రెండు మనస్సుల మధ్య నింపుతాయి

హిమవత్పర్వత మంత శూన్యాన్ని.

మనస్సులేని మగ 'సిరి' గలవానికి కావాలి

ఓ బాల వ్యభిచారిణి,

ఆమె వంటిమీద పంటిగాట్లు, వాడి

పైశాచికత్వానికి పరాకాష్ట.

ఆమె మర్మాంగం నుండి కారే రక్త స్రావం

వాడికి తెలిసిందదే జీవనసారం.

అరబు షేకుల మోజులు

గ్రుచ్చాయి జాకీ పాత్రలలోని బాలల

చేతులలో మేకులు.

కడుపునిండా కూడెట్టాల్సిన కన్నతండ్రి
కడుపు 'పండిస్తుంటే' చెప్పకోలేని మూగరోదనలో
ఓ అజ్ఞాత బాలిక చావుకేక.
తాగుబోతు తల్లిని లేపడు
ఆలినే లేపుతాడు అందుకోసం.
బహిర్భూములు కన్నెపొరల చీలికలకు
కేంద్రాలుగా మారుతుంటే ఈ
కాలానికేదో పట్టింది, ఆవహించింది.
కుక్క కక్కింది తిరిగి గతికే చందానా
ఇంటిలోని పెంటను ఇంటి ముందరే పోస్తుంటే
తిరిగి మన ఇల్లే ఓ పెద్ద పెంటకుప్ప.
తెడ్డు కేం తెల్సు పాశం రుచి
వాడి పడేసిన 'కండోమ్' కేం తెల్సు
వాళ్ళు పొందిన ఉద్దీపనల స్థితి.
తల్లి పాలలోని చిక్కదనం, తాగిన వాడికన్న
'వాటిని' పిండిన వాడికే తెల్సు,
అది వాడికో బ్రహ్మరహస్యం.
అందుకే ఈ విశ్వం కన్న తల్లి వంటిది
కన్న తల్లి ప్రేమకు సరిహద్దులు లేవుగదా!

## కవి వీలునామా.....

నీలో నువ్ నవ్వు కుంటున్నావ్
నీలో నీవే మాట్లాడు కుంటున్నావ్
వానలో తడుస్తూ నవ్వుతావ్
నీళ్లలో మునుగుతూ నవ్వుతావ్
నిప్పులపై నడుస్తూ నవ్వుతావ్
ఆశ్చర్యంగా యుందే !
నీకు బాధగా లేదు........
భయం వేయటం లేదు........
నీకు మానసిక వైద్యం
అవసరం అంటున్నారు వారు.
అందర్నీ వెలేస్తావా
అరె చెప్పేది నీక్కాదు
కాసింత వినవయ్యా !
మరణం నిన్నేమీ చేయలేదా
మరణ శాసనం కూడా రాసేశావా.
సంఘం కోసం ఓ కన్నీటి బొట్టు ను జారవిడిచి
కన్నీటి వీలునామాను రాసేశావా.
ఎంతటి త్యాగం నీది
నీ కన్నీటి బొట్టు ఆవిరై
మేఘంగా మారి
జడి వాన కురిస్తే
ఈ నేలంతా సస్యశ్యామలం అవుతుందనేగా నీ ఆశ.
చాలా బావుందయ్యా నీ వీలునామా !
అయితే పదనేనూ వస్తా నీతో
ఓ కవి వరేణ్యా
కలం కదుపుతా నీతో
కదం తొక్కుతా నీతో
నీవు రాసిన వీలునామా
నా జాతి ప్రగతికి చిరునామా. 21-11-2000

# చైతన్య బాట కోసం ......

కన్నీటి ధారలతో నాకళ్ళు

కుళాయిలయ్యాయి.

రక్తం, నీరు కల్సి ప్రవహిస్తుంది,

నా కళ్ళ నుండి.

ఏదో  ఆలోచన

ఏదో ఆవేదన

కొన్ని సార్లు నిర్వేదం

అంతంలేని ఆలోచనలు

బుర్రను హీట్ చేస్తున్నాయి.

భరించలేని ఆలోచనలు

మోయలేకున్నా

ఆలోచనల మధ్య

చివాట్ల తోటి

కాలం ఈదుతున్నా  అయినా

రోదనం నిత్యం అయింది.

అందుకే

నాకళ్ళు

కుళాయిలయ్యాయి

కన్నీటి ధారలతో చెక్కిళ్ల
చారికలే రహదారుల్లా తయ్యారయ్యాయి.
తూర్పున సూర్యుని చూస్తే
అపుడే తెల్లారిందా అన్న నీరసం
కాలం ఇంత స్పీడ్‌గా
పయనిస్తుందే అన్న
ఆలోచనలు
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తూ
గుక్క తిప్పనీకుండా చేస్తున్నాయి.
బిక్క చచ్చిన నాకు కొంత
ఊరట కావాలి,
ఊపిరిలూదాలి,
జవసత్వాలు తిరిగి పుంజుకోవాలి
చైతన్యబాటలో తిరిగి పయనించాలి.
సాయం కోసం చూస్తున్నా
ఊతమిచ్చే వారి కోసం ఎదురు చూస్తున్నా
కళ్లను ఇంత చేసి
కాలం వైపు ఎదురు చూస్తున్నా.

# ఆకాశానికి నిచ్చెన.....

ఆకాశానికి నిచ్చెన వేద్దామని
అర్ధరాత్రి ఆలోచన వచ్చింది.
ప్రయత్నం ఆరంభించా
ఆరాటం, ఆశలు
శ్రమలు, వృధా ప్రయాస,
నిచ్చెన చివర నేను ఏకాకిని.
నిచ్చెనకు అందని బ్రతుకు
నిచ్చెన కవతల అంతా శూన్యం
అయినా నా
ఆరాటం చుక్కల్ని కోద్దామని
చంద్రునిపై ఫుట్‌బాల్ ఆడదామని
గ్రహాలపై చక్కర్లు కొడదామని
నా  ఆరాటం.
అయినా
నిచ్చెనకు అందని బ్రతుకు,
నిచ్చెన కవతలంతా శూన్యం.
నిలువెత్తు నిచ్చెనకు
ఆవేశం ప్రాణం అయితే,
నిచ్చెన అవతల శూన్యానికి
ఆధారం ఆలోచనే.
ఆలోచన ఆవేశాల రంగరింపే
జీవిత మార్గం,
జీవిత సారం.
ఆకాశానికి నిచ్చెన వేద్దామన్న ఆలోచన
ఆధారాన్నిచ్చింది, నాలో
సరిక్రొత్త ఆలోచనలకు తావిచ్చింది,
సరిక్రొత మార్గాలను అన్వేషించమంది.

21-11-2000

# సముద్ర సంధ్య

సముద్రపు హోరు, అలల జోరులో
కోట్ల కొద్ది ఇసుక రేణువులు ఒడ్డుకు
కొట్టుకొస్తున్నాయి.
ఒక్కో ఇసుక రేణువు అగాధంలోని
తన అనుభవాలను వివరిస్తోంది,
అనుభవాలన్ని కలసి ఇసుక తెన్నెలగుట్టగా
కళాత్మకంగా నాక్కన్విస్తున్నాయి....
సరవిచెట్లు గాలికి ఊగుతూ
గాలిలోని అంతర్లీన నాదాన్ని
సరిగమల రూపంలో సాక్షాత్కరింప చేస్తున్నాయి.
ఆలుచిప్ప, నక్షత్రపు చేప
జెల్లీ ఫిష్‌లు
వీసాలు లేని ప్రయాణీకుల్లా
విల విల లాడి పోతున్నాయి.
బీరులు తాగుతూ కొందరు
బికినీ సుందరుల అంగాల అందాలు
కళ్ళతో కొలతేస్తున్నారు.

స్విమ్మింగు లెర్నర్స్
జలపుష్పాల వేటగాళ్ళు
బల్ల కట్టుపై కొందరు
స్టీమ్ బోట్లపై మరికొందరు
వాళ్ళ పనుల సందడిలో వాళ్ళు .
కొత్త జంట కాబోలు
ఆవిడ చెప్పులు కూడా తడవ కూడదని
అతగాడి ప్రయత్నం.
కేరింతలు, తుళ్ళింతలు
టూరిస్టుల, గైడుల సందడి
పల్లీలు, పకోడీలంటూ
చిల్లర వ్యాపారుల హడావిడి.
బీచ్ హోరులో
జనాల జోరు జోడయింది.
చీకట్లు కమ్ముకొంటున్నాయి.
చలి పుట్టిన మేఘాలు
నీటి ఆవిరిని కోటుగా కప్పకున్నాయి.
మేఘాలపై నీటి ఆవిరి
శ్రామికుడి నుదిటిపై స్వేదంగాను
మేఘాకృతి
వాడి శరీరాకృతిగాను

నాక్కన్పిస్తోంది.

నే నొస్తున్నా మీరు తప్పకోండి

అన్నట్లు

చిరుజల్లు ఆరంభం అయింది

మంత్రిగారి పైలట్ కారులా.

వర్షం జోరందుకుంది

బీచ్ సుందరులు ఎదలు ఎగసి పడేలా

ఎటువైపో సాగిపోతున్నారు,

పల్లీల వాళ్ళు పరుగులంకించుకొంటున్నారు.

టూరిస్టు బస్సుల హారను మోతలు

వర్షం హోరుతో పోటీ పడుతున్నట్లుంది.

సముద్రం మాత్రం అల్లరి అబ్బాయిల్లా

అలలను ఎగదోస్తూ

ఇసుక రేణువులను తీరానికి నెడుతూనే ఉన్నాయి.

అందమైన సాయంత్రం

వర్షం పాలయినా

సుందరమైన సముద్రతీరం

సరికొత్త అందాలను సింగారించుకొంది.

23-11-2000

# శిశిర ఘోష

చలికే మొచ్చిందో ఏమో
డొక్కలో పేగులు ఉంగలు పడేలా
వంగ పెడుతుంది
క్రుంగ దీస్తోంది.
గ్రుక్కెడు నీళ్ళు త్రాగినా
లోనికి పోలేనిస్థితి.
అన్నం ఎదురుగున్నా
ఖాళీ చేయలేని దుస్థితి.
ఏ జంతువు త్యాగమో నాకు
ఈ కంబళి రూపంలో
నులి వెచ్చదనాన్నిచ్చి కాపాడుతుంది.
పేగుల రచేత పట్టుకొని
భగవంతుడా కాపాడమని
గట్టిగా అరవాలనుంది
నోరు పిగలదు
మాటరాదు
ఆ దేవుడిలో చలనం లేదు
మాటారాదు.
దేవుడూ చలిపులికి
దడిచి జారుకున్నాడేమో.

27-11-2000

## సైబర్ బతుకు

జీతం చుట్టూర

జీవితాలు తిరుగుతూ

జీవితాల్ని జీతపురాళ్ళు

తూకాలేస్తున్నాయి.

రక రకాల రాళ్ళు

రవ్వంత రాళ్లలోనే

కొండంత కోర్కెల్ని చెక్కుకుంటూ

చెమట బిందువుల్ని

ముత్యపు రాళ్లలా మార్చుదామని

కొందరి ఆరాటం, ఆశ.

పోరాడి ఓడినా

పోరాటం ఆపక

పోరులో రాజీపడక

బతుకు పోరులో

బలయ్యే బడుగు జీవి

భవిష్యత్ అంధకారబంధురం.

ఆశలు అనేకం

ఆలోచనలు పలువిధాలు

అయినా

గమ్యం అగమ్య గోచరం

కొందరిది.

అయినా ఆగదు

ఈ పోరాటం.
జీవిత పథ నిర్ధేశనని
జీతపురాళ్ళు నిర్ణయిస్తుంటే
జీవిత గమనం
జీర్ణావస్థకు చేరుకుంటుంది కొందరిది.
సైబరు కేఫ్‌లో
ఇంటరనెట్టులో
డిస్కోథెక్‌లో
డీలాపడి
జీతాన్ని, జీవితాన్ని
హరణం చేసుకొంటూ
జీవిస్తున్నారు మరికొందరు.
ఆధునిక మానవుడ్ని
వెంటాడి వేధించే
సమస్యలు వేన వేలు
అయినా
ఆగదు ఈ పోరాటం.
జీవితాన్ని జీతపు రాళ్ళు
నిర్దేసించినా
ఆదేశించినా
ఆగదు ఈ పోరాటం
ఆగదు ఈ ఆరాటం.

25-11-2000

## అన్వేషణ ....

అనవరతమైన ఆలోచనలు

అన్వేషణకుపక్రమిస్తాయి.

అన్నం కోసం అన్వేషణ

పానం కోసం అన్వేషణ

ప్రాణం కాపాడు కోవటం కోసం

రక్షణ కొరకు అన్వేషణ.

భూమిపైన అన్వేషణ

భూమిక్రింది పొరలలో నిక్షిప్తాల కోసం అన్వేషణ.

భూమి వయస్సు కోసం అన్వేషణ

పర్వతాలలో అన్వేషణ

పరమాణువులలో అన్వేషణ.

అగాధంలో అన్వేషణ

సముద్ర తీరంలో అన్వేషణ

సముద్ర గర్భంలో అన్వేషణ.

అన్వేషణే అన్ని అభివృద్ధులకు మూలం

నిరంతరాన్వేషణే మానవాభ్యుదయానికి మార్గదర్శకం.

4-12-2000

# అక్షరం అన్నమైన వేళ

రోజుకు రెండు ముద్దలు తింటే
బతుకు గడుస్తుంది.
నిరంతరం కవిత్వం రాస్తే
సమాజం బతుకుతుంది.
అన్నం ముద్దలో అనంత శక్తి ఉంది
కవిత్వంలో
అణువుల్ని మించిన విస్ఫోటనం ఉంది.
అన్నార్తుల ఆకలికి ప్రతి రూపం కవిత,
అపన్నుల ఆవేదనకు ఆక్షరరూపం కవిత.
ప్రజాసమూహానికి ప్రతినిధి కవిత్వం,
గళమెత్తిన జనానికి ప్రతీక కవిత్వం.
అన్నం మనిషికి మనుగడ ఇస్తుంది,
అక్షరం ఆలోచనకు ఊపిరిపోస్తుంది.
అన్నం ముద్దలో కోట్లాది జీవుల
ఆంతర్యం దాగిఉంది,
అక్షరంలో అసంఖ్యాక హృదయాల ఆర్తిఉంది.
అడుగు వేయాలంటే అన్నం కావాలి,
ముందడుగు వేయాలంటే అక్షరం కావాలి.
అందుకే ముద్ద తినకుంటే నాకు నష్టం,
కవిత వ్రాయకుంటే సమాజానికే నష్టం.



కె.జె.రమేష్

## గోడమీది పిల్లి...

కిటికీ కున్న గాజు గ్లాసుల్లోంచి

ఉదయమే గమనిస్తున్నా.

చిక్కుడు చెట్టుక్రింద ఓ పురుగు కోసం

రెండు పిట్టల పోరు

పోరు జోరుగా సాగుతోంది.

ప్రక్కన వేరే వేరే కీటకాలు

వాటి పనులలో అవి మునిగున్నాయి.

సూర్య కిరణాలు ఇంకా ప్రతాపం చూపలేదు,

పంచాయితీ పంపులింకా వదలలేదు.

కిటికీలోంచి చూస్తూనే ఉన్నా

పిట్టలపోరు ఆపలేదు.

రెక్కల నుండి ఓ ఈక

రాలినట్లుంది,

అదిగాలికి పరిగెత్తడం ఆరంభించింది.

కోడి ఒకటి ఆశగా ఆ ఈక వైపు పయనం సాగిస్తోంది.

దూరంగా మేకలు, గొర్రెలు వాటి

బిడ్డలకు పాలిస్తున్న ఆనందంలో వాటి అరుపులు

అనుభూతులు అవి పంచుకొంటూ

నాకు శ్రవణానందం కలుగచేస్తున్నాయి.

నేనుచూస్తూనే ఉన్నా

పిట్టల పోరు ఆగలేదు.

పోరులో శరీరాలు వేడెక్కి

పిట్టల చలిని

ఎదిరించాయి.

ఆలోచనల హోరులో నా

తనువు పులకరిస్తోంది.

పోరు వీక్షకుల్లో మరో

ప్రేక్షకుడు తోడయ్యాడు నాకు.

గోడమీద పిల్లొకటి చెవులు రిక్కించుకొని

టికెట్‌కొనని క్రికెట్ ప్రేక్షకుడుగా

గోడమీదనుంచి వీక్షణం.

దానిలో కోటి ఆలోచనలు

క్రొత్త క్రొత్త కోర్కెలు ఉద్భవిస్తున్నట్లు

దాని చూపులు చెబుతున్నాయి.

పిట్టలపోరు జరుగుతూనే ఉంది,

పిల్లి వాటి పోరు వైపు చూస్తూనే ఉంది.

22-11-2000

## అదృశ్యశక్తి....

ఏదో శక్తి ఆవహిస్తున్నది
ఏదో శక్తి నన్ను నడిపిస్తున్నది
ఏదో శక్తి నన్ను పంపిస్తున్నది
ఏదో శక్తి సరిక్రొత్త ఆలోచనలు గావిస్తున్నది.
ఎడారులలో ప్రశాంతత వెదకటానికి
ఎండిన గుండెలపై చన్నీళ్ళు చిలకరించటానికి
ఏదో శక్తి నన్ను పంపిస్తున్నది.
అభాగినుల ఆర్తనాదాలకు
ఆపన్నుల ఆక్రందనలకు ఆలంబనగా ఉండమని
కదన రంగంలో కాలు మోపమని
ప్రేరేపిస్తున్నది నడిపిస్తున్నది.
అన్యాయాన్ని ఎదిరించమని
అరాచకాన్ని ఖండించమని
హత్యారాజకీయాలను అరికట్టమని
ఏదో శక్తి నడిపిస్తున్నది.
గుక్కెడు నీరు లభ్యం కాదు భువిలో, కాని
ఇసుక రేణువులు చెబుతాయి రుధిరంతో
నిండిన గాధలెన్నో.
పట్టెడు మెతుకులు పండవు మాగాణులలో కాని
మాగాణులు చెబుతాయి

మారాజులు మదించిన రాచక్రీడలకు

ఆహుతైన పచ్చని పంట పొలాల పరవళ్ళు.

భూమిలో దిగే నాగలికి ఏవో

తగులుతాయి, చిక్కు కుంటాయి అవి

మానవ కపాలాలు కావచ్చు

మానవ కంకాళాలు కావచ్చు.

రుధిరంతో పంటలు పండుతాయి రానున్న రోజులు,

రుధిరంతో పండే పంటలకు రుచి ఉంటుందా,

తిన్నా సౌఖ్యం దక్కు తుందా!

నేలమ్మకూ చరిత్ర ఉంది దాని

చరిత్ర దానిది.

చరిత్ర విప్పితే కొందరి బడాబాబుల బ్రతుకులు

హాంఫట్.

చరిత్ర చెపితే కొందరి చరిత్రలు నేటితో

ఖతం.

అయినా చరిత్ర చదవమని

గ్రహించమని

రానున్న తరానికి చెప్పమని

ఏదో శక్తి నన్ను ఆవహిస్తున్నది.

మా బావులు మా నీరు అన్న వారు ఏరి

మా చెరువులు మా నీరు అన్న వారు ఏరి

మా దేవుడు, మాజాతి, మాతెగ అన్న

నాయకమ్మణ్ణులు ఎక్కడ ?

ఇవన్నీ చెప్పమని, వివరించమని

ఏదో శక్తి నన్ను నడిపిస్తున్నది.

చరిత్ర

చదవాలి

వినాలి

గ్రహించాలి

మంచిని ఉంచాలి పెంచాలి

సమసమాజ నిర్మాణానికి ఉద్యుక్తులు

కమ్మని చరిత్ర చెప్పాలి మనకు.

అందుకే

నన్ను ఏదో శక్తి

అదృశ్యరూపంలో

నడిపిస్తున్నది

ఆవహిస్తున్నది

పంపిస్తున్నది.

18-11-2000

# తల్లి లేని శిశువు........

అమ్మ చనిపోయిందని

వాడికి తెలియదు

వాడికి చెప్పినా తెలియదు

చెప్పినా చిరునవ్వుతో వింటాడు.

అటు ఇటూ చూస్తాడు.......

అమ్మ కోసం కళ్ళు తిప్పుతూ

అటు ఇటూ చూస్తుంటాడు.

అయినా వాడికి తెలియదు

అమ్మ చచ్చి పోయిందని.

తండ్రికి సంక్రమించిన మహమ్మారి జబ్బు

తల్లినీ సైతం పైలోకానికి పంపిందని

వాడికి చెప్పినా తెలియదు.

చెప్పినా చిరునవ్వుతో వింటాడు.....

వాడికి తెల్సింది ఒక్కటే

అమ్మ చనుబాల తీపి తప్ప

ఆ అమాయకుడికి ఇంకేమి

తెలియదు.

# రేపటి వారధులు

నాబడి పిల్లలు

బండెడు పుస్తకాలు మోస్తూ

ప్రాక్టీసు చేస్తున్నారు

రేపటి బతుకు పుస్తకం చదవటానికి.

నా బడి పిల్లలు

ఇరుకు గదుల్లో

దుమ్మూ, మురికి బట్టల్తో

ఫీజులు కట్టలేని దుస్థితిలో

పుస్తకాలు కొన లేని స్థితిలో

గడుపు కొంటున్నారు రోజులు

రేపటి రోజులైనా తియ్యగా ఉండటానికి .

నాబడి పిల్లలు

విజ్ఞాన యాత్రల నోటీసు చూచి

మాట్లాడరు మారు మాట్లాడరు.

మౌనం చాలు వారి నిస్సహాయత

వారి ఆర్థిక మాంద్యం తెలుపటానికి.

నా బడి పిల్లలు

కడిగిన ఆణిముత్యాలు అననుగాని

ఆప్యాయతకు అనురాగాలకు ఆలంబనలు.

అలుపెరగని ధీరోవంతులు వారి

గరువుల శుశ్రూషలో.

మాలో చూసుకొంటారు వారి

అమ్మల్ని, నాన్నల్ని, అన్నల్ని.

మాలో చూసుకొంటారు వారి ప్రతిబింబాల్ని

మలుచుకొంటారు వారి జీవితాల్ని మమ్ములను ప్రాతిపదికగా.

తెలుసుకొంటారు గ్రహించుకొంటారు

భావిజీవితం భారం కాదని

అది

తమ తమ సాధనలో నేయుందని.

అందుకే

నా బడి పిల్లలు ఆణిముత్యాలు అననుగాని

అసువులివ్వడానికైనా సిద్ధపడే ధీరులు

ఆప్యాయతలకు నెలవులు

ఆనంద తీరాలు చేరుటకు

నాకు వారే వారధులు. 18-11-2000

## బతుకు.....

వానకురిస్తే,

చెట్లు చిగిరిస్తే,

పక్షులు కిలకిల రావాలు గావిస్తే,

పసి పిల్లలు చిరు నవ్వులు చిందిస్తుంటే,

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంటే,

ఏ రోజు సిలబస్ ఆరోజు పూర్తి చేసుకుంటే,

నా ఆర్టికల్స్ పత్రికల్లో ప్రచురితం అవుతుంటే,

మానాన్న నన్ను చూసి పొంగిపోతుంటే,

మా అమ్మ నన్ను చూసి ' మా అయ్యరా ' అని ఆనందపడి పోతుంటే,

నా శ్రీమతి చిరునవ్వుతో ఎల్ల వేళలా ఎదురొస్తుంటే,

మా పెదబాబు నా కవితల్ని శ్రద్ధగా శ్రవణం చేస్తుంటే,

దిన పత్రిక తెచ్చు అబ్బాయి పత్రిక సకాలానికి తెస్తుంటే,

సైన్సు పేపరు కష్టంగా ఉంది అనినా పిల్లలు చెప్పకుండా ఉంటే,

నా మిత్ర బృందం నా కోసం ఎదురు చూడకుండా ఉంటే,

నే ఆనందంగా ఉంటా,

నే ఆనందంగా నవ్వుకుంటా,

నే ద్విగుణీకృత ఉత్సాహంతో,

దిక్కులు పిక్కటిల్లేలా కవితా గానం చేస్తా,

కవితలు ఆలపిస్తా

కవితలు జపిస్తా

జపిస్తూ మరణిస్తా.

18-11-2000

## ఆకలి-సౌఖ్యం

నిండుకున్నాయి
ఇంట్లో బియ్యం
ఎండుకొన్నాయి
మా డొక్కలు.
మండుతున్నాయి
మా కళ్ళు
పెల్లుబుకుతున్నాయి
మాలో ఆవేశాలు
అయినా
నిండుగా పొంగి పొరలి
ప్రవహిస్తున్నది బారుల్లోబీరు.
ఖుషీ అంతు చూస్తామంటున్నారు
డబ్బున్న మారాజులు.
గంతులు వేసే డ్యాన్సర్ల
వలువలు వలిచేస్తున్నారు స్ట్రిప్ టీజర్లు.
వెల యిచ్చి వెలయాలి వలువలు
వలిచేస్తున్నారు.
అయిదు రూపాయలతో గోరు వెచ్చని
సుఖం దొరుకుతుంది గుడిశలోన.
వందల వరదతో
పట్టుపరుపు మీద పరచుకొంటుంది
సుతిమెత్తని సౌఖ్యం స్టారు హోటళ్ళలోన.
సుఖంలోను తారతమ్యం
సౌఖ్యంలోను భేదాల బేరం.
లోకంలో
ఆకలి రెండు రకాలు
ఒకటి అరగని ఆకలి
ఇంకొటి ఆకలి ఆకలి.

# సాఫల్యం అంచున

మంచి శబ్దాల్ని ఏరి
వాక్యాలుగా మలచి
వాటిని ఓ వరుసలో పేర్చి
మస్కిష్కంలో బాంబుగా
నిక్షిప్తం చేశా.
రిమోట్ సాయంతో పేల్చాలని
నా ప్రయత్నం.
సమయం కోసం చూస్తున్నా
ఏ క్షణంలో నయినా పేల్చవచ్చు,
పేలవచ్చు.
పేలిన మరుక్షణం....
సారీ
ప్రయోగం
విఫలం కాకూడదని
కోరుకుందాం.

22-11-2000

## రైలు పోతూవుంది.....

ఎక్కిన రైలు పోతూవుంది...
ఎక్కిన రైలు పోతూ వుంది...
పోతూ తనలో అనుకొంటున్నది ఇలా
ఎంతకాలం నాకు ఈ గాడి చాకిరీ....
ఎంతకాలం నాకు ఈ పట్టాలపై ప్రయాణం
ఎంతకాలం నాకు ఈ చెప్పలు లేని చక్రాలతో పోరాటం.
రైలు కష్టాలు రైలువి
రైలు ఆలోచనలు రైలువి.
రైలుకి కోరికలు లేవా?
రైలుకి స్వేచ్ఛా జీవితం వద్దా?
పెట్టెలో ఎక్కి అక్కడే
ఊస్తాడు ఒకడు,
సీట్లకు జోలెకట్టి తమ బిడ్డల్ని
ఆడిస్తారు కొందరు...
ఈ సీట్లు మావి, మీరెవరు అని ఉరిమి
చూస్తుంటారు కొందర్ని మరికొందరు.
మరుగు దొడ్లు కొన్ని సార్లు
కొందరికి కామకేళి కేంద్రాలుగాను,
కొందరికి మందుశాలగాను,
సీట్లులేని వారికి జాగాలగాను ఉపయోగపడ్తుంటాయి.
అందుకే
రైలు కష్టాలు రైలువి
రైలు బాధలు రైలువి.
బెర్తులపై జారిగిలపడి క్రింద నిలబడ్డ
అమ్మాయిల ఎదలపై ఎక్సరే చూపుల దాడి కొందరివి,
అపరాధిని ఏసయ్యా! కృపజూపుమయ్యా అంటూ
అన్నార్తుల ఆలాపనలో కొందరు,
బోగీ శుభ్రం మిషతో కొందరు,

బూట్లచోరీలో మరి కొందరు.
తట్ట బుట్టలు అడ్డుపెట్టి
బోగీలో ఒన్‌వే సృష్టించు వారు మరి కొందరు.
ఇందరితో పరిగెడుతూ
ఇలా బ్రతుకు ఈడ్వవలసిందేనా!
ఇది రైలు ఘోష
ఇది రైలు భాష.
అందుకే
రైలు కష్టాలు రైలువి
రైలు బాధలు రైలువి.
వ్యధలు నిండిన బ్రతుకుల్ని
ఒళ్ళు మండే పనులు చేసే ధూర్తుల్ని
భళ్ళున తెల్ల వారేసరికి గమ్యస్థానాల్ని చేర్చు
రైలుకీ బాధలున్నాయి, వ్యధలున్నాయి.
కానీ ప్రయాణంలో
ఆగదు, తేడాలేదు.
అమ్మయ్య అదృష్టం
రైలుకి మాత్రం
జాతి, మత, వర్గ భేదాలు లేవు,
అది తన బాధల్ని దాచుకుంటూ
అందర్నీ తనలో ఇముడ్చుకొంటూ
ఒక్కర్ని ఓ చోట
మరొకర్ని వేరే చోట
వారి వారి మజిలీలలో
చక్కగా దించుతుంటుంది.
ఆగదు ఆ రైలు ప్రయాణం
తీరదు ఈ మానవునికి దానితో ఎన్నటికీ సంబంధం.

18-11-2000

# సమాధి స్వగతం....

సమాధి విజయ గర్వంతో
విర్రవీగుతోంది.
భూ మండలాన్నే లినరాజుని నేటి నుండి
తనలో ఉంచుకుంటున్నా అన్న
గర్వంతో విర్రవీగుతుంది.
అబ్బ ఎన్ని ఆభరణాలు,
ఎన్ని రకాల సెంట్లు,
ఎన్నెన్ని క్రొత్త ఆయుధాలు,
ఎన్ని పట్టు వస్త్రాలో.
సమాధి ఆనందం పట్టలేకపోతోంది
కొద్ది రోజులకో
క్రొత్త విషయం బోధపడింది.
సమాధిలో శవంలో కుళ్ళుతుంది
అబ్బ దుర్గంధం
విజయగర్వం 'ఉఫ్' మంది,
పట్టు వస్త్రాలు పీచులయ్యాయి,
ఆభరణాలు అదృశ్యమయ్యాయి,
అత్తరు పన్నీరుల అడ్రసేలేదు.
మిగిలింది కంపు
కంకాళం
సమాధికి వదిలింది మత్తు
వదిలింది దాని తుప్ప.
అందమైన సమాధి ఆంతర్యం
అందరికీ అర్థమయ్యేనా!

21-11-2000

## చీకటి హృదయం

చీకటికే నోరుంటే

అమ్మబాబోయ్

ఆధారాలతో వర్ణించదా

అన్ని విషయాలు,

ఋజువులతో రూఢీ చేయదా,

కొందరి భోగట్టాలని, చిట్టాల్ని.

చీకటికి కళ్ళే కాదు, నోరు లేదు

కాని చీకటికి

మనో నేత్రం ఉంది.

ఆకాశంలో నక్షత్రాలు చూసి

ఆనందపడుతుంది, కాని

బయటపడదు.

గాలి ఆరాటం

పక్షి గూళ్ళలో గుడ్ల

తస్కరణలు,

అర్థరాత్రి కొందరి ఆగడాలు

దూరంగా నక్కల అరుపులు

ఎక్కడో వేటకుక్కల ఆహారం కొరకుపోరు,

మదోన్మతుల మధ్య నలుగుతున్న
మగువ ఆక్రందన
చూస్తుంది కాని
వివరించదు.
మనో నేత్రంతో వీక్షించినా
మనస్సులోనే ఉంచుకుంటుంది.
మనస్సునందే అణచుకొంటుంది.
మర్మాలను పదిలంగా దాచుకొంటుంది.
చీకటీ వాళ్ళతో చేరిందా ఏమిటి?
వాళ్ళ కనుకూలంగా ప్రవర్తిస్తుంది,
నర్తిస్తుంది.
విషయాలను హృదయాంతరాళాలలో
నిక్షిప్తం చేసికొని
గూఢంగా, నర్మగర్భంగా
నిర్భీతితో చరిస్తుంది, సంచరిస్తుంది.
ప్రకృతిలో భాగమై
లీనమై
చరిస్తుంది, సంచరిస్తుంది
అందుకే చీకటి మాట్లాడదు.

# గాయాలపుట్ట....

నా మనస్సు ఒక గాయాల పుట్ట
ఒక్కో గాయానిదో గాథ.
వ్యధలు బాధల సమ్మేళనంతో
మొదలై, గాయాలు చివరకు
చీము నెత్తురులు చిమ్ముతూ
మరింత నా మనస్సును బాధిస్తుంటాయి.
'మనో నిబ్బరం' అనే మందుతో
ప్రస్తుతం నా బతుకు ఈడుస్తున్నా.
సంఘం సమ సమాజం
ప్రజలు బాధలు వారిగాధలు
ఆకలి, అన్నం, అడుక్కోవటం
రోగం, వైద్యం, వాణిజ్యమయం
అమాయకత్వం, వాటి ఆసరా, వాడుకోవటం
నిర్లజ్జ, నిర్లక్ష్యం, క్షణికావేశం
భాష లోపించటం, భావం జొప్పించ లేక పోవటం,
అపార్థాలకు తావివ్వటం
అందుకే
నా మనస్సు ఒక గాయాల పుట్ట.

పుట్టుకతో మొదలైన నా ఈ పోరాటం
నాకు తెలియని ఏదో ఆరాటం.
కాని అసలైన జీవిత పోరాటం
ఇపుడిపుడే ఆరంభం, అనుభవం.
అనుభవసారం రంగరించుకుంటే నాకు తెల్సింది,
జీవితం పూలపాన్పు కాదని
ఇది భయంకర విషజ్వాలల సర్పంతో పోరాటమని.
అందుకే నా మనస్సు ఒక గాయాల పుట్ట.
అనుభవం కొన్ని సార్లు ఆనందాన్నిస్తుంది
అనుభవం కొన్ని సార్లు అవకాశాల్ని పెంచుతుంది.
అనుభవం అన్ని సార్లు పనికిరాదని
అనుభవం మరిన్నిసార్లు కావాలని
నా కనుభవం వచ్చింది.
అందుకే నా మనస్సు ఒక గాయాల పుట్ట.
ఆలోచల అగ్ని రూపంలో
బాధల ద్రవం నా మస్తిష్కంలో వేచిఉంది
విచ్చుకున్న పుష్పంలా
పండిన పండులా
సిద్ధంగా ఉంది ఏ క్షణంలో నయినా

చిమ్మవచ్చు, కమ్మవచ్చు, పేలవచ్చు.

నిజంగా మస్తిష్కం ఎంత గొప్పది

కోట్ల కోట్ల టన్నుల ఆలోచనలు నిక్షిప్తం.

అందుకే

నా మస్తిష్కం ఒక వెబ్ సైట్లగని.

ప్రతి వెబ్ వెనుక ఓగాధ ఓ బాధ

కాని

ప్రజల బాధలు తీర్చే,

స్వార్థ పరుల ఆటలు కట్టించే,

దుర్మార్గాన్ని అరికట్టే,

అవినీతిని అంత మొందించే,

సమ సమాజస్థాపనను నిర్దేసించే,

వెబ్ సైట్లు కావాలి రావాలి

ఆ పనిలో నేఉన్నా

అంతవరకూ

నా మనస్సు ఓ గాయాల పుట్ట.

18-11-2000